# పంచవటి

(ఖండకావ్యము)

మాధవపెద్ది
బుచ్చిసుందరరామశాస్త్రి

పబ్లిషర్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు
రాజమండ్రి

# పి తృ స్మ ర ణ

ఎవనికి నిలువేల్పు నవవర్ష జలధర
శ్యామసుందరుఁడు శ్రీరామచంద్రుఁ
డెంత క్రోలినఁ దృప్తియే కొల్ప దెవనికిఁ
దారక బ్రహ్మగాంధర్వగీతి
అఖిలాండకోటి బ్రహ్మాండ మెవ్వని కను
పాపలోపలి పసిపాప యయ్యెఁ
గరగె నెవ్వఁడు చంద్రకాంతమట్లు దినమ్ము
రామాయణమ్ము పారాయణమున

నా యశఃకాయు పితృశంకరాభిధేయు
భవ్య మాత్మయె నా దృష్టిపథమునందు
ద్యోతిలుత దివ్యమంగళజ్యోతి యగుచుఁ
బరమపావన శీతల ప్రభలతోడ !



## క వి ప్ర శం స

నృత్య సరస్వతీ కటక నిక్వణముం బ్రకటించుకొంచు సా
హిత్య సరస్వతీ హృదయ మిచ్చుచు గానసరస్వతింబలెన్
సత్య పదార్థ కీర్తనము సల్పెడు మత్కవితా సరస్వతీ
నిత్యత చాలు, స్వర్గమును నీరస మీ రససిద్ధిముందటన్.

మోదములోన మోదమయి పోదురు, ఖేదములోన ఖేదమై
పోదురు, సర్వమున్ గరగిపోవును వారల దృష్టి. వారి యా
హ్లాదవినోదముల్ కడు విలక్షణముల్, కవులన్న నిత్య సూ
ర్యోదయకాల మానససరోవరహంస లటుల్ రసప్రియుల్.

మా నవఖండ మండల సమన్విత రాజ్యము కాత్మవేదమున్
మానసశాస్త్ర మన్నవె ప్రమాణము లీపరిపాలనం బొకిం
తేని యెఱుంగరాని దొక హృద్గతభాషనెకాని దాననే
కానఁగవచ్చు మా రసజగద్వ్యవహార సమస్త శాఖలున్.

ఖిన్నతనేని తీపి గలిగించి దరిద్రుని భాగ్యవంతునిన్
ఖిన్నతలేని మార్గమునఁ బెట్టు కవీశ్వరు రాజ్యమందుఁ గై
కొన్నకొలంది నెల్లరకుఁ గొల్లరసానుభవంబు, రండు మీ
పున్నెము పండివచ్చినది భోక్తలుగండు రసజ్ఞ శేఖరుల్.

ఆదిన్ మాదు రసప్రపంచము రసాలాకారతం జెందఁగా
స్వాధిష్ఠానముగాగఁజేసి కవితాశాఖన్ సుధామాధురిన్
నాదంబున్ వెదలింపఁడే ప్రణవఘంటంబోలి రామాయణ
ప్రాదుర్భావ వసంత కోకిలముగా వాల్మీకి సుశ్లోకియై.

కరగించున్ శిలనైన మాదు కవితాగంధర్వసంగీత కి
న్నరకంఠస్వర దేవతాహృదయ సౌందర్యాప్సరోనృత్య సి
ద్ధరసాస్వాదన నిత్యనూతన మహోద్య ద్రాజ్యలక్ష్మీధురం
ధర విద్యాధర చక్రవర్తి యదుగో! నక్షత్రలోకమ్మునన్.

ఆ విద్యాధరితో సువర్ణమయపీఠాసీనుఁడై యల్ల స్వే
చ్ఛావాతావరణంపు భోజసురభూజచ్ఛాయఁ గొల్వుండెనే
యావాడే కవికాళిదాసరసరజ్యద్రాజరాజేశ్వరుం
డావాల్లవ్యరసప్రపంచములకే యైక్యాను సంధానముల్.



# రా మ దూ త

ఇదిగో! నీవు నిమిత్తమాత్రు; డగుమీ, యే నే సుమీ నిర్వహిం
చెద రామాయణమున్ సమస్తమును, నీ జిహ్వాస్థలిన్ నిల్చెదన్
పద స్మగ్రామకుటీరవాసమునకున్, భావింప నేమాత్రమున్
హృదయస్వాస్థ్య మ టన్నదే కుదురబో దీ పట్నవాసంబులన్.

పెడకుం బట్టినబుద్ధి త్రిప్పుకొను మబ్బీ! యెవ్వఁ డే గంగలోఁ
బడ నీకేమిర! చూచుకొమ్ము తరణోపాయమ్ము! సంసారమున్
గడుపన్ నే ననువాఁడ లే నటర, నీ గగ్గోలె కానీ! యి కం
గడికే యెక్కక నీదుకైత భగవత్ కైంకర్యమౌ గావుతన్.

ఉదయము పార్థివంబు వలయున్, ధ్వనియించి ధ్వనించి పోవలెన్
హృదయము రామనామమున, నెల్లపుడున్ స్తుతిపాఠమన్నదే
యుదరనిమిత్తమై సలుపకుండ వలెన్, బరమోపశాంతి నె
మ్మది కవితాసమాధినె నిమగ్నముగా వలయున్ గృతిక్రియన్.

అతిపరమప్రశాంతహృద్యమ్మన బ్రాహ్మముహూర్తమందు ని
క్కృతికి నుపక్రమించుటయు షేపకడన్ విరమించుచుండుటన్
బ్రతిదినమందు నీవు పరిపాటి నొనర్చి రచించుటం దనా
హతమునఁ గర్ణికాగ్రమున హంసను స్తంభన చేయఁగావలెన్.

అపు డాబ్రాహ్మముహూర్తమందె యదిగో! యాజానకీ రామచం
ద్ర పరబ్రహ్మము వాయురూపిగ జగత్ సంచారముంజేసి తూ
రుపురేకల్ తెలవాఱు నావఱ కొనర్చున్ సుప్రబోధంబు ప్రా
ణిపయిన్ బ్రాణిపయిన్ దదీయకృపఁగంటే యెంత యుద్గాఢమో?

స్థాయి పారిజాతతరుమూలమున నాకు,
హాయి రామచింతనామృతమున,
నార్తి గలిగి భక్తు లనుకొంటయే చాలు,
వచ్చి గంతు[illegible] ప్రాలుచుందు.

వేయు నేటికి మా రామవిభునివంటి
శ్యామసుందర మదనమోహనుఁడు లేఁడు!
అమ్మహాధర్మవీరు నామమ్మె చాలు
త్రిభువనమ్ములు మోహాముద్రితము లగును.

నారద నీ కొకింత యయినన్ గనవచ్చెనె కోఁతిరూపు ? నా
యాకృతియందు దానిపొడ యైనను లేనిదె కోఁతి నంచు వా
ల్మీకి లిఖింపఁ గారణము లేదు మఱేమియునేని భ క్తిమై
నేకడ రామదూత నని యే నొకతోఁక దగిల్చికొంటయే.

ఎవఁడుర కోతి నే నఁటర ? యీశ్వరతేజమునన్ జనించి వి
ష్ణువె హృదయంబుగాఁ గల మనోజవమారుతతుల్య వేగుడన్
నవమదనాభిరాముఁడను, నవ్వగు విన్నకొలంది కోఁతి నే
యవునెడ నాదుపేర నెటు లయ్యెను సుందరకాండ మట్టులన్ ?

స్వాదువులౌ ఫలంబులను స్వచ్ఛములైన జలంబులన్ మితా
స్వాదన చేసి చేసి తుది వాయువె భక్షణముం బొనర్చి వ్యా
సాదులు మున్ను హంసగమనాగమనమ్ము లెఱింగి యింద్రియో
న్మాద మడంచియే కవనమార్గముఁ బట్టిరి కుమారకా !

నాదసుధన్ గ్రమోపశమన మ్మయి పోయినయట్టి క్షుత్పిపా
సాదులతో శతాబ్దులు శతాబ్దులు యోగసమాధి నుండి ము
న్నాది ఋషీశ్వరుల్ ప్రకృతి కావల నిల్చి త్రికాలవేదులై
యేది ధ్వనింపఁజేసి రదె యీశ్వరవాణి సుమా కుమారకా !

స్థాయి గుదుర్చుకొమ్ము భ సుసంధ్యలలో దినమున్ దినమ్ము గం
గా యమునా సరస్వతుల గానసుధారసధారచేఁ బ్రతి
ప్స్నాయువు నంటిపట్టు మలినమ్మును క్షాళనఁ జేసికొమ్ము రా
మాయణ నిర్వికల్పక సమాధికి నే సమయమ్ముఁ జూచెదన్.

ఈ మహనీయ యత్నము ఫలింపఁగ సర్వసుపర్వమౌళిమా
లామణి చక్రచుంబితము లక్ష్మణదేవ సమేత జానకీ
రామపదాబ్జపావనపరాగము మౌళి నలంకరించి నీ
వీమెయి మౌనముద్ర వహియింపు మిదే నిను నావహించెదన్.

పావన మౌ సహస్రదళపద్మసువర్ణ మయాలయంబులో
శ్రీవరుఁడైన రాఘవుఁడు చిన్మయుఁడై వెలుఁగొందుచుండె నీ
జీవనపుణ్యతీర్థమున శీఘ్రమె క్రుంకిడి దాటిపొమ్ము మా
యావరణమ్ము, నామకుసుమార్చనవేళ యతిక్రమించెడిన్.

పోతనకన్నఁ బండితకవుల్ గల రెందఱొ నాఁడు నేఁడు త
ద్రీతిఁ గవిత్వమున్ నడిపిరే తెనుఁగందున నెవ్వరేనియున్ ?
హేతు వదేమొ గుర్తెఱుఁగు మెంతటి మేటికవిత్వమేని స్వ
జ్యోతి బహిర్గతం బగుట చొప్పడకున్న నిరర్థకం బగున్.

రా మ దూ త

నీ వా[ఘ్రాణమవో త్వగింద్రియమవో నేత్రంబవో జిహ్వవో
కా వట్లే శ్రవణంబవేని మఱి యాకాశంబవో భూమివో
కా వ ట్లగ్నివయేని వాయువవునుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవ పరబ్రహ్మైక్యసంధానతన్.

లే వచ్చోటను ద్వేషరాగములు చెల్లే లోభమోహమ్ములున్
దావే దుర్లభమౌ మదమ్మునకు మాత్సర్యమ్ముకున్ ధర్మమున్
గా వీ వర్థము కామమోక్షములునుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవ పరబ్రహ్మైక్య సంధానతన్.

లే దే మాత్రము మృత్యుశంకయని యట్లే జాతిభేదం బనన్
రా దట్లే తలిదండ్రు లన్నదియుఁ దీరా జన్మమే నట్టిదై
నీ దన్నట్టిదె లేక యాత్మ యొకటే నిర్వాత దీపాంకుర
ప్రాదుర్భావముఁ జెందు రాఘవ పరబ్రహ్మైక్య సంధానతన్.



## పంచవటి

ఎవియో లీలల నేల చూపెదవు మే మింకేమియున్ గోర మె
క్కువ యేదీ యొకసారి చూపగదె యా గోదావరీతీర పం
చవటీపర్ణకుటీరవాస మునివేషం బేకపత్నీవ్రత
స్తవనీయమ్ముఁ బ్రసన్నరాఘవము సీతాలక్ష్మణోపేతమున్.

ఎవ రా పుణ్యతపోవనాంతరములో నేకాంతవాసమ్మునన్
లవలీపల్లవశయ్యపై ? నతఁడు లీలామానుషం డైన రా
ఘవుఁడేనా ? మఱి యెవ్వ రా సరస ? సాక్షాదాదిలక్ష్మ్యంశసం
భవ యా భూసుత సీతయా ? శత మివే భక్తిప్రపూర్ణాంజలుల్.

అవుఁ గానీ మన లక్ష్మణుం డెచట ? శయ్యాకల్పనానంతరం
బవలం బోయెనె సత్రపుష్పఫలతోయార్థంబు వేయేడు లా
యువురా లక్ష్మణ నీకు ! మాట యనుకొంచుండంగనే వచ్చినాఁ
డవురా ! యెన్నిఫలంబులన్ గుడువఁబెట్టన్ దెచ్చియున్నావురా.

మధురఁగఁ బండుపండులను మాపును జేపును దెచ్చియన్నకున్
వదినెకుఁ జేతికిచ్చెదవు, వారిది భుక్తియు నీది తృప్తియున్
క్షుధ యెటు పోయెఁ బండె రుచిచూడ వహో! జలమేని గ్రోలకే
బ్రదుకఁగ వచ్చునే పవనపారణమాత్రముతోనె లక్ష్మణా!

ఎటు శమియించుచున్నది జ్వలింపక లో జఠరాగ్ని వాయు వే
మిటొ యటు భుక్తిగాఁ బరిణమించి క్షుధన్ సుధజేయు నేమిటో
ఇటు లొనరింప శేషఫణి కీ వవతారమ వౌటఁ జెల్లె నెం
తటి ఘనమైన దీ యఘటనాఘటనాపటిమంబు లక్ష్మణా!

స్థిరతరంబైన యోగసంసిద్ధిఁ జేసి
చిత్తమే క్షీరసాగరస్థితి వహింపఁ
బాలతరగల నాలిలఁ గ్రోలు నీకు
నీఫలజలంబు లెటు రుచియించుఁ దండ్రి!

అడవిని క్రొత్తక్రొత్త లయినట్టి ఫలంబులు దెచ్చి చేతి కి
చ్చెదునపు డెల్లఁ దద్రుచి విశేషము లీ వెఱిఁగించుచుంట సా
పడి కొనితెత్తు వీ వనుచు భ్రాంతి వహింపర యేని యంత్రపే
ముడిగల యన్నయున్ వదినె ముట్టుదురే ఫలమొక్కఁడేనియున్.

చూచుచున్నయట్లు వినుచున్ వినుచున్నటు చూచు నీవు మూ
చూచుచునే ఫలంబుల రుచుల్ గ్రహియింతువుగాని నాల్కపై
వైచుక కాదు, కేవలము వాసుకి వీ వనుమాట వారికిన్
దోచదు మానుషత్వమున దోఁగిన హేతువుచేత లక్ష్మణా! ౬

వలపున కచ్చమున్ మొగలివంటిది నీచెలి, నీవు భోగిమం
డలముకుటాయమానుఁడవు, నైజముగా నవకామయౌవనో
జ్జ్వలత క్షణక్షణంబును బొసంగును నాగకులమ్ము; కెట్లు రాఁ
గలిగితి చుట్టవేసుక సుఖంబుగ బ్రొద్దులు పుచ్చుకుండఁగన్. ౭

పదముల నంటి వేడెడిని పాపము నీ వెనువెంట రాఁగ మీ
వదినెకుఁ దోడుతోడు వనవాస మొనర్చును లెమ్ము లక్ష్మణా!
మొదల యొసంగుమంచును బ్రపూజ్య సుమిత్రయనంగనాఁడు నీ
హృదినెఱిగింపవొక్కొ! హృదయేశ్వరి యుమ్మలికంబువాయగన్.

వల దనువాఁడ నావననివాసముకుం గొనిపోవఁగాఁ గుతూ
హల మది లేకనా? జనకు లా గురుపాదులు పేరుఁ బెట్టి రూ
ర్మిళ యని, నీ కనాగత మెఱింగిన యంత మహర్షి వాక్కు ని
ష్ఫల మగునే పరస్పరముఁ బాయుట తప్పునె తప్ప దెట్టులన్.

జనకుని యాజ్ఞచే వనికి సాగఁగ నుండినయట్టి నేను నీ
జనకుని యాశయమ్మున కసమ్మతి నూను టసంగతంబు; తో
డన గొనిపోదు ప్రాణ మిచటన్ బడియుండు శరీరమంచుఁ దె
ల్పినపయిఁ గాదె ని న్నడుగు వేయగ నిచ్చినదామె లక్ష్మణా!

ఎటనో యున్న దయోధ్య, యందునను నీయిల్లాలు, నీవుంటి వి
య్యటవిన్ బంచవటీ శిలాతలమునం, దౌ నేమి యేకత్ర యు
న్నటులేకా సతి యోగనిద్రను త్వదీయాత్మాను సంధానతన్
ఘటముల్ దూరములైననేమి మతు లొక్కండైన నంతర్ముఖా!

అణుమాత్ర చ్యుతిలేని యోగము నిత్యస్వచ్ఛ మాణిక్య ద
ర్పణమౌ నీహృదయంబులోఁ బ్రతిఫలింపన్ నీసతిన్ నీ వను
క్షణమున్ జూచుటలేదొ, యాయమయు నీశ్వాసోర్మిరూపంబె ల
క్ష్మణ, కైసేయదొ నీకు నామెకు వియోగంబౌట యింకెట్టులో?

అనాఁ డొక్కొకయాకె చేతి కిడగా నాయన్న యీ పర్ణశా
లానిర్మాణ మొనర్చినాఁడ, వొకవేళన్ నిద్దురం జేసి తే
యేనాఁ డెట్టి నిశీథమం దయినఁ దంద్రీ లక్ష్మణా! యట్టె యా
సీనుం డయ్యెద వల్ల ప్రాంగణశిలాసింహాసనం బందునన్.

పద నిద్రింతురు పూజ్యపాదు లదిగో! పాషాణ సింహాసనం
బెదురుం జూచుచునుండె నీకొఱకునై యేకాకివై కూరుచుం
డెదుగా రే తెలవాఱులుం గునికిపాటే లేక సూక్ష్మంబుగా
నెది శబ్దించిన వించుఁ బాముచెవు లోయీ! నీవి వీరవ్రతా! 16

ఈలలితంపు దేహలత కెండ యొకించుక సోకకుండ నే
లాలవలీ లవంగలతలన్ గొని చెంతల నాటి చేతినీ
రాలను బెంచ మీవదినె రమ్యవితాన మమర్చికొంటి కా
బోలు శిలావితర్దికకుఁ బొల్చిన చందనమూల మందునన్. 17

స్వచ్ఛాకాశ గభీరపర్వతదరీ సాంద్రాటవీ నిర్ఝరీ
స్వేచ్ఛాగానపరీత మైన ప్రకృతి స్నేహానుబంధమ్ముతో
స్వచ్ఛందానిలభుక్తితోఁ దప మిటుల్ సాగింతువే పుష్పవ
ల్లీ చ్ఛాయాసుఖ వేదికన్ విషయనిర్లిప్తాంతరంగమ్మునన్. 18

చందనమూలదేశమున స్వచ్ఛశిలాఫలకమ్మునందు నా
నందతరంగముగ్ధనయనమ్ములతో బొమ వెత్తి చూతువే
యెందుల కోయి! మా రఘుకులేశుని యానతికన్న నీకుఁ గో
రం దగినట్టి దేది యొక రవ్వయు లేదు గదోయి లక్ష్మణా! 1

అంత సమాధినిష్ఠుఁడవె యయ్యును జీమ చిటుక్కు మన్న గు
ర్తింతువు విల్లు నమ్ముల ధరింతువు భద్రము ఘోరరాక్షసా
క్రాంతము ప్రాంతమంతయును రక్షణభారము నీకుఁ బెట్టి ని
శ్చింతగ నిద్రఁ జెందెదరు సీతయు శ్రీరఘురామచంద్రుడున్.

అమితప్రోజ్జ్వల మైన నీయమృత దేహచ్ఛాయ యీ యంధకా
రమున్ సైతము దృక్పథంబును సువర్ణస్నాన మాడించెడున్
సుమనోజ్ఞం బగు నీస్వరూప మటులే చూడంగఁ జూడంగ ని
ర్నిమిషంబై నయనద్వయంబును మనోనేత్రంబు విప్పారెడిన్,

ఏ వ్యావృత్తి యొకింత లేక నిరతం బీదైవసృష్టిక్రియా
కావ్యగ్రంథమునే పఠించుకొనుచున్ గంభీరశైలాళి మౌ
నవ్యాఖ్యల్ పరికించి చూచు మునిబృందం బంతరార్థం బిటన్
సువ్యక్తంబు భవన్ముఖంబున నొనర్చున్ భాష్యకారప్రభూ!

నీ వా యన్నయు నివ్వనిన్ వెడలినన్ మీ యశ్వినీదేవతా
లావణ్యాధిక రామణీయకతనూలాలిత్యముం గ్రోలఁగా
మీవెంటం బడి దేహభావ మన లేమీ లేకయే వచ్చి మీ
భావైక్యంబునఁ జొక్కుచే యిచట జీవన్ముక్తి ఋష్యాళికిన్.

అఖిలార్థకామ సమన్వయ ప్రాపిత
పరమ స్వధర్మ నిర్వహణచణులు
ఆలోక్యమాన పిపీలికాది బ్రహ్మ
పర్యంత తుల్య స్వభావ రమ్యు
లుపనిష త్పుణ్య పీయూష పాన విశేష
దినదిన నవనవో త్తేజితాత్మ
లాజ్ఞానిరీక్షక హంసవాహన దహ
రాకాశ వీధీ విహారదృష్టు

అత్యధిక పంచవర్ణమయ ప్రభూత
చిత్కళామంది రాంతర జీవ దేవ
నిరత సుఖ లోలు రతిపూజనీయు లైన
మౌనులు గదయ్య! మీ శ్రోతృమండలంబు. ౨౪

అత్ర్యాది సప్తమహాఋషుల్ వారెత
చ్చరణ సంస్పర్శయే స్పర్శవేధి
అతడె యాపస్తంబుఁ డావృత్త చక్షువు
కేవల బ్రహ్మపదావలంబి

యా నారదుఁడు తురీయాతీతుఁ డాకాశ
గమన దూరశ్రవణములవాఁడు
ఆవలి జాబాలి యత్యద్భుతావహ పర
కాయ ప్రవేశలాఘవము గలఁడు

సంయములు వార లరుగో ! స్వచ్ఛందమరణు
లౌటయే గాక సశరీర మైనయట్టి
స్వర్గసుఖ ముందు రని పూజ సలుపు టీరు
లోకసంగ్రాహణార్థ మౌనే కదయ్య ! 25

ఎట నేపక్షినిగాని యేమృగమునేనీ వేయకే పోఁగఁగ
న్నటులే చూచు దయాంబురాసులు గదయ్యా ! నీవు నీయన్న యే
మిటికై తాల్చెద రా శరాసనములన్ మీ రట్టు లెల్లప్పు డ
న్నటు లీఘోరవనస్థలీదనుజ సంహారం బొకం డుండెగా !

పదిలము లక్ష్మణా ! యిచటి పంచవటీతటి నింతదాఁటినన్
విడులుచు నుందు రం దిసుక వేసిన రాలనియట్టు లెందుఁ ద
త్పదదళితంబు గాని దగుపట్టదు వారల మన్కిపట్టులన్
మెదలదు జంతువేదియును మింటను బాఱదు పక్షి సైతమున్.

అవురా! యెంతటివింత సాజముగ మాంసాహారియౌ క్రూరజం
తువునేసి యిచటన్ దపోమహిమ సాదుం జేసెనే కాని దా
నవు(డై పోయినయట్టి మానవు నొకింతన్ మార్చలేదయ్యె వా
స్తవిక స్వస్థితికన్న వచ్చు నడుమంత్రం బెంత దుస్సాధమౌ. 26

మణిదీపికా స్వర్ణమందిరాంతఃపుర
స్థల హంసతూలికాతల్ప మేని
చంద్రకాంతోప లాస్థానమంటపమధ్య
నవరత్న సింహాసనంబు గాని
వైదూర్య నీల గోమేధిక మరకత
విద్రుమ పాదుకావితతి యేని
సమయజ్ఞ సేవక స్ఫటికపాత్రానీత
బహువిధ ప్రసవాసవములు గాని

చతురుదధి మేఖలా వలయిత సమస్త
భూతధాత్రీశ్వరీ కరాంబుజముగాని
రామవనవాస దీక్షాధురంధరతను
నింతయు సడల్ప(జాల వయ్యెను గదయ్య. 27

అమితప్రేమరసప్రసన్నను నయోధ్యన్ వీడుటే గాదు త
న్మమతాగంధమె పాఱనీయఁ డహహా ! మాజానకీజాని ప్రే
మ మయత్యాగమయ స్వధర్మమయ సంసారస్వరూపమ్మెద్యే
యము మాకెల్లపుడల్లదే యొసగు నత్యంతాత్మ మాధుర్యమున్.

యమనియమాదులన్ శమదమాదులచేతను జిత్తశాంతి ముం
దమరుచుకొన్న వీరపురుషాగ్రణి యౌటనె యట్టి రాజభో
గమును బరిత్యజించెఁ దృణకల్పముగా నొనరించి వాని స్వా
మ్యమునకు సామ్య మాతని గృహవ్రతసిద్ధికి నుద్ది యున్నదే !

పితృవాక్పాలనకై కరస్థ మగు పృధ్వీరాజ్యమెల్లన్ దృణీ
కృతముం జేసినయట్టి యన్న హృదయప్రీత్యర్థమై యెల్లజీ
విత మిట్లర్పణఁ జేసి విస్మితునిఁ గావింతే శిరోధార్య మ
ప్రతిమానమ్మ భవచ్చరిత్ర మసిధారాతీక్ష్ణతీక్ష్ణవ్రతా !

కావించినావు గోదావరీ సుఖవాయు
పరిచితస్థలిలోనఁ బర్ణశాల
సమకూర్చినా వాశ్రమముతోడిపాటు సీ
తారామచంద్ర విహారభూమి

నెలకొల్పినావు చిన్ని సరస్సు నొకదాని
నీలోత్పల స్వర్ణనీరజముల
నిలిపినా వొక రమణీయ వృక్షచ్ఛాయ
జానకీరామ విశ్రాంతిపీఠి

మఱపునకుఁ దెచ్చినావు లక్ష్మణకుమార!
అన్నవదినెల కయ్యయోధ్యాపురమ్ము
నిమ్మహారణ్యమందునే యింద్రభోగ
మమర పదవియు స్వర్గసౌఖ్యము ఘటించి.

ఏదో రాజ్యము నీకు నీవలయునే యేతెమ్ము సింహాసనం
బారోహింపుము దేవ రాఘవ ధనుర్జ్యారోపితాశీవిష
క్రూరాకారశరమ్ముతో నిలుతుం నీకుం బ్రక్కగా నన్న నీ
తీరుం జూచి జగత్త్రయం బడలిపోదే నాఁడు రామానుజా! 34

సమమై పోయెను క్రోధశాంతులటులన్ సంరంభముం జూపి సం
యమనం బంతటిలోఁ బొనర్చితివి రామాజ్ఞాప్రకారంబుగా
శమితంబై జ్వలదగ్ని చందనముగా సాక్షాత్కృతం బయ్యెఁ బ్రా
ణముదక్కెం జుమి మంథరాయుతముగన్ గైకేయి కానాఁటికిన్. 35

గుణ మగుపడ్డ నైజ మనుకొందువు. దుర్గుణ మున్న సుంత నై
రణ మొనరింపనేర వపరాధము దైవతపీఠినుండి ల
క్ష్మణ! డిగకే విచారణను సల్పినచో నరజాతి భూమిపై
మనుటయె దుర్లభంబనఁడె మారఘురాముఁడు నాఁడు లక్ష్మణా!

హృదయము నెప్డు డూర్ధ్వమునకే పరకించుక యీ నరత్వమ
న్నది యొకలీలఁ జేయఁ దెలియంబడునే మనుజస్వభావ మా
పదవిని డిగ్గికే పతితపావనుఁడన్ బిరుదంబు రాదు మా
చదు వొక రామచంద్రునికె సర్వము హృద్గతమోయి లక్ష్మణా!

పరులకె కాని దైవ మను భావము మా రఘురామమూర్తికే
నరుఁడ నటన్న భావమె మనంబున నయ్యభిమాన ముంటనే
నరున కుదారజీవనఘనత్వము నంత యనుగ్రహించెఁ దా
నెఱుఁగునె దైవమేని మును పెన్నడు నట్టి కృపాసహిష్ణుతల్.

ఎపు డొకటే సుఖంబయి యొకించుక కావలెనన్నఁగూడఁ గ
ష్టపురుచి యన్నదే పడయఁ జాలని దైవతకోటికన్న నె
ల్లపు డొకదాని నొక్కటిగ నంటుక వచ్చుచుఁ బోవు కష్టసౌ
ఖ్యపుఁ గలగల్పు గల్గు నరు లన్నసె ప్రీతి జనించు లక్ష్మణా!

కన్నీలు కన్నెలే యగుచుఁ గల్పము లేగినఁగాని తల్లులా
టన్నది లేనె లేనియవు డందఱు నొక్కటెగాని పెద్దలుం
బిన్నలటంచు లేనపుడు బింబముకుం బ్రతిబింబ మంచు లే
కున్నపు డింక స్వర్గ మదియుండియు నేమి ఫలమ్ము లక్ష్మణా! 40

పరుఁడే యాభరతుండు నీయటులనే ప్రాణాధికుండైన సో
దరుఁడేకా రఘురామచంద్రుల కెటుల్ దండెత్తినాఁ డంచు ను
ద్ధురతం జూపితి వల్లనాఁ డెఱుక లేదో నీకు నామాత్ర ము
త్తెఱ గెల్లన్ భవదీయ భక్తిగరిమోద్రేకంబె సూచించెడిన్. 41

నీదియ కాదె రాజ్య మది నే నెటు లేఱదు నీకుఁగాను నీ
పాదుకలే యనన్ భరతు భక్తికినై రఘురాముఁ డెంతో యా
మోదముఁ జెంద ఖేదమును బొందెద వగ్రజుప్రేమ యింకనే
సోదరుఁడేని నీయటులఁ జూరగొనందగఁడేమి లక్ష్మణా! 42

అడవికిఁ బాఱఁదోలెఁగద యా సవతమ్మ యయోధ్యనుండి మా
పడనెడి రాజభోగ మెడఁబాపి భళీ! భరతా! యిఁకామెకుం
గొడుకువె గానఁ బాదుకలుగూడ హరించితి విప్పు డీ నెపం
బిడి యనునంతదా కఠిగె లేలొకొ నీహృదయంబు లక్ష్మణా! 43

ఉదయము నిత్య మీవు శిరసాగ్గడి పాదుకలొఁ చేత నీ
మది కవి యన్నఁజాల నభిమానమె యందులకే నటయ్య యీ
వ్యథ తిరుగన్ రచించుకొనవచ్చును భాగ్యమొ లేక బంగరో
కొదవయొ యియ్యరణ్యమునఁ గొయ్యయునుం గొణతంబు లక్ష్మణా!

తొడిగెడు రామపాదుకలఁ, దోడ్కొనిపోవుచు నీకు మాఱుగా
నిడియెద రాజ్యపీఠి ననఁడే భరతుం డిఁక వీని నింతతో
విడిచితి నే ననండె రఘువీరుఁడు దాఁ దిరుగాడు పెట్టులో
యడు గిడరాని కంటకసమాకుల మివ్వనమంచుఁ గుందితే?

అవి చన నేమిలే తిరుగ నట్టివి వేఱ ధరింపఁబోఁడె రా
ఘవుఁ డని లోన నెంచు నవకాశమె లే నటు పల్కి రాజగొ
రవ మిడి యల్ల పాదుకల రాముఁ డిడెన్ తనమాఱుఁగాఁగ న
య్యవియును రామునింబలెనె యప్రతిమానములొక్కొ లక్ష్మణా!

మొదలే తల్లికి వెన్కఁ దల్లిగద వ్యామోహంబునన్ జూచుకొ
న్నదిగాఁ గన్నులఁ గన్నబిడ్డలుగ బాల్యంబాదిగా నెన్నఁడే
నెదురే పల్కనివారుగా భరతుఁ డీ రేకంబెకా యేమి యా
డెదమో లక్ష్మణ! కారణార్థ మిటు లుండెన్ గైకరూపంబుగన్.

ఎక్కడికి నక్కడికె సరిలే
నోర్చుకొని యెంత మనసు గుదుర్చు
నడవి యనినప్పు డడవియే యగును గాని
యొక్కనాఁటికినేని యయోధ్యగాదు. 48

సమశీతోష్ణ సుఖప్రదంబు బహుసస్యశ్యామలంబున్ ఫల
ద్రుమసంశోభితమైన కోసలమునందున్ సర్వసంపత్సమృ
ద్ధమయోధ్యాపుర మొప్పదే ప్రకృతికాంతా గర్భశుక్త్యుత్తమో
త్తమముక్తాఫల వైఖరిన్ ధళధళోద్యత్సౌధపారంపరిన్. 47

వివిధ పుష్పోద్యాన విశ్రాంతివేదికా
సుఖవాయుసేవ నోత్సుకజనమ్ము
నవనవోన్మేష సౌందర్యలక్ష్మి రత్న
దర్పణోపమిత రథ్యాతలమ్ము
జనపదాగత ధాన్యసంచయ క్రయ వస్తు
సముదాయ విక్రయ సామరవము
తత్తత్ప్రదేశ నూతన నిత్యనిర్మిత
లీలానివాస కేళీవనమ్ము

# ప ం చ వ టి

సకల రాజకియ సంస్థా వ్యవస్థాధి
కారివర్గ ముఖ్యకార్యనిలయ
శతశతాధికమ్ము సాకేతనగరమ్ము
స్మృతిపథమ్ముఁ బాయు దెటు క్షణమ్ము.

సరయూ మాతృక్షీరము
మఱువ దయోధ్యాపురీ కుమారిక వృద్ధిం
బొరసియు నెప్పటి కపుడే
చిరనూతన మైనయట్టి శిశు సమ్మితమై.

పరిసరోద్యానములలోఁ బ్రభాతములను
వివిధ పుష్పాపచయము గావించు పుష్ప
లావికాగీతికలకుఁ దాళములు వేయుఁ
దన్నది సదా తరంగహస్తములతోడ.

తటము నెటు చూడ ప్రాంతకాంతారవాసి
పరమ నిష్ఠాగరిష్ఠ తపస్వి పాద
చిహ్నముద్రిత మెందు దర్శించినార
లీర అటువంటి పుణ్యవాహిని తిరిగి.

నడికిరేయి జలక్రీడ నడిపిపోవు
నప్సరోజన దివ్యదేహములనుండి
లులిత మగుచుంటఁ దన్నదీజలము సతము
లలితలలితంబు లాలితలాలితంబు. ౕ౧

ఆయెడ ఘట్టఘట్ట వివిధాసనపాళి నిషణ్ణులై త్రయీ
గాయనగాయనీమణులఁ గాన మొనర్చుచు నుండరే యుష
స్సాయములందుఁ బ్రత్యుపనిషత్తును గేయముగా నొనర్చి స్వ
ర్గీయపదాతిశాయి యయి కేవల బ్రహ్మపదమ్ము నంటగన్. ౕ౨

ఆముఖబ్రహ్మతేజము సహస్రముఖంబులఁ గామధేను చిం
తామణులట్లు శిష్యసముదాయము కోఁకలి దప్పి తీర్ప బో
ధామృత మిచ్చుచుండరె మహామహితాత్ములు మౌనిచంద్రులం
దేమి వచించుచుండినను నీశ్వరవాణి ప్రతిధ్వనింపఁగన్. ౕ౬

ప్రాశన కిన్నియంబువులు పర్ణములన్ ఫలముల్ గదా తపో
రాసులు బ్రహ్మవాదులు పరాశరముఖ్యఋషీంద్రు లీశ్వరా
దేశ మభిస్వరింపరె శ్రుతిస్మృతిరూపము గాఁగ మేఘ గ
ర్జాశతముక్తకంఠముల సర్వము యోగబలమ్మె వారికిన్.

ఫలమె భుక్తికి నటు గాని పక్షమందు
నట్టి దేదొ యపక్వపదార్థ మంతె
యన్యజనమున తె నవధాన్యములను
నేల నెవరేని దున్ని పండించు టెల్ల.

అతిథిపూజాపరాయణు లర్చమాన
హరిహర పితామహులు పురుషార్థపరులు
బ్రహ్మతేజః ప్రపూర్ణులై పరిఢవిలరె
యజ్వ లప్పురిఁ బ్రజ్వలితాగ్నులట్లు.

సరయూతీర శిరీషపుష్పవన సంచారం బయోధ్యాపురీ
సురుచిత్వానుభవంబు లో మఱపువచ్చున్ వచ్చినం గాని త
త్పరమామ్నాయ పవిత్ర శీతల వచోధారాభిషేకమ్ముఁ ద
త్పురవాసి ప్రబలానురాగము నొకప్డున్ జ్ఞప్తికిన్ దక్కునే.

మిన్నున్ మన్నును గానరానియటు గ్రమ్మెన్ జిమ్మచీఁకట్లు నా
యన్నా! లక్ష్మణ రాక్షసాకులము ఘోరారణ్యమేగాక యా
సన్నంబైనది కాళరాత్రియును బాషాణంబునం దొంటినే
యున్నావా? యటు పర్ణశాలఁ జొరరాదో నీవ్రతం బొప్పదో.

అవిగో ఘోరతరార్భటుల్ వినుటలేదా ? విన్ననేమాయె నం
టవు గాఁబోలును నీమనంబునకు ధ్యానంబందె యున్నావు దా
నవు లేరే నిటుప్రక్కగా మెదలినంతన్ జేత విల్లందుకొం
దువుగా లక్ష్మణ ! డించివేతుగద చిన్మాత్రిద్రన్ సమున్నిద్రతన్. 62

అటులన్ జూచిన నెంత ఘోరము మనుష్యవ్రాతముంబట్టి తం
పటలం బెట్టుచునున్నవా రసురు లీప్రాంతంబునంగూడ నెం
తటి దుర్గంధమొ చుట్టవేసినది నీనాసాపుటంబందె చొ
చ్చుట లేకున్నదొ రాముఁ డాజ్ఞ యిడ కచ్చో నీవు పోనేరవో. 63

ఆ ముని పాప మెవ్వఁడొ కదా ! యటు పట్టుక యంటఁదీతురే
చీమలమట్టి కింకఁబయిఁ జెండుటయా యొడలెల్ల వాఱలే
గా మఱినెత్తు భైరవుబు గ్రమ్ముచునున్నవి కళ్ళు వానియం
దేమియు లేదు దోసమని యీశ్వరచింత యొకండు దక్కగన్. 64

ఎవఁడొ రక్కసుఁ డేదొ వచించుచుండె
ఖరునితోడుతఁ దోడి రక్కసులు వినఁగ
వింద మొకవేళ మీర లీ విపినమునకు
వచ్చుటాదిగ నడచిన వార్త లేమొ. 65

ప ం చ వ టి

నర లోకమువ్వ రీమనవనంబును జొచ్చి స్వకీయ మట్టు లే
ర్పఱచుక పర్ణశాల నదె పంచవటిన్ నివసించుచున్న వా
రిరువురు వారిలోఁ బురుషు లింతి యొకర్తుక యెల్లవేంట నొ
క్కరు విడనింక నొక్కరుగఁ గాచుచునుందురు వారలాయమన్.

ఎటఁ బొడగట్టువాని నటనే పుటమార్ప వ్రతంబు గొన్నవా
రట ! యిటువంటి పాముపగ రాక్షసు లన్ననె గాని బాధ నొం
దుట సహియింపనోపరట దోమయుఁ జీమయునేని యబ్బ ! యి
య్యెటవిని నేఁటికిన్ వెలసి రన్నయుఁ దమ్ముఁడు రామలక్ష్మణుల్.

నరులన ద్వేషభావమునవా వధియించుట పాడుపొట్ట కీ
శ్వరుఁ డటు పెట్టెగా మనకు భక్షణ చేయనె చేయరేగదా
పొరిగొన నేటికో మనల బుద్ధి గలార మటలచుఁ జాటుకొం
దురు నరు లంతకంతకు నధోగతిలోఁ బడిపోవుచుండియున్.

పసులవిధమ్మునన్ దనుజభక్షణ కేర్పడువారికిన్ దపో
వ్యసనము వ్యర్థ మంచుఁ గద భంగమొనర్తుము దానదైవ వి
శ్వసనము లే దటంచ్రు మునిబాలిశు లట్టులెయైన నేటికీ
యసురుల కొక్కలంకనె శివాలయముల్ నవలక్షకోటిగన్.

మృగముల్ పక్షులు మీకు మాకెటులనో మీరేని మాకట్టులే
ఖగవన్నిర్ణయ మన్నఁగాని మదికే పట్టించుకోఁబో రనా
దిగ నీవచ్చెడిదారి కడ్డుపడి మ్రందింపంగఁ బై వత్తు రీ
విగ నెట్లీ దురుపద్రవం బడచి స్వామీ! మమ్ము రక్షించెదో! 70

పొడిచినది చుక్క చీకటు
లడఁగెడి దూరుపదె తెల్లనాయెను జెవులం
బడుచుండె విహగరుతములు
గడి వైతాళికుల మేలుకొలుపులు వోలెన్. 71

ఎదురెదురన్ ధ్వనించు సెలయేటికి నావలికొండ సొల్పునం
దుదయము పక్షిఱెక్కలటు లూగుచు వాలుచు నొయ్యనొయ్యలో
నొదుగుచు దూరదూర మగుచుండెడి నీడలఁ జూచి యన్నయున్
వదినెయు నీవు సూర్యభగవానున కర్ఘ్యము లీయవత్తురే. 72

ఎవ రెవరిఁ గూర్చి శోకిలె
దవు స్వామీ! యవిగో! యశ్రుధారలచారల్
మివుల మలినమ్ము లొనరిచి
నవి శుద్ధసువర్ణదర్పణ కపోలములన్. 73

మఱిఁ బుత్రవిరహహేతుక
పితృమృతియే గాక దుఃఖపీడితజీవ
న్మృతమాతృశోచనీయ
స్థితియుఁ గలంగించుచున్నదే సౌమిత్రీ !

ఆస్వస్థానమునందు నున్నయెడ జ్యోత్స్నాపూర్ణ మీరాత్రినె
ట్లాస్వాదింతొ ప్రియాద్వితీయుఁడవుగా నారామదేశమ్మునన్
నాస్వామీ ! యెటువంటిరేయి యెటు శూన్యప్రాయమైపోయె స
ర్వస్వ మొక్కట తపోవ్రతమ్మునకె ధారం బోసికొంటే ప్రభూ !

ఆయుద్యానసరోజలాంతరితతీరానేకభూమీరుహ
చ్ఛాయాదృశ్యసహోత్సుక ప్రియసఖీ సంయుక్త నౌకావిహా
రాయత్తంబులు పూర్ణిమానిశలు వాయంబోవు చిత్తంబెటుల్
స్వాయత్తీకృత మైన నాయనుభవం బాలాటి దేనాఁటికిన్.

కడచెన్ బూవులపండుగం బదె నదో కాలం బదో జీవితం
బెడ మైపోయెడి నాఁడునాటి కకటా ! యింతేని సంబంధ మే
ర్పడకే వేర్పడుచుండె నుందరదివారాత్రంబు లెన్నెన్నొ యె
క్కడి దీక్షావిధి యిట్టి వింకఁ బమనాగ్గా హా ! వసంతర్తువుల్.

చూడన్ లేమురతండ్రి వల్కలమటుల్ చుట్టంగఁ గంజూపులే
నీడల్ వాలెడిమేని కొత్తిడి యగున్ నీ రౌను మాగుండె వ్రే
లాడన్ జొచ్చె నవేమిటోయి! తలనీలాలన్ జడల్ గూడ నా
వీడన్ రాదొకొ పినినీవ్రతసమాప్తిన్ జేయు పర్యంతమున్. ౭౮

ఇది పీతాంబరమా? మఱే దయినఁ గాని హేమచేలంబ? నీ
మది కెట్లొప్పెనొ యెన్నొయెన్నొ జనకక్ష్మాజాని మొన్మొన్ననే
గద మాస్వామికిఁ గట్టబెట్టె మధుపర్కంబుల్ మహార్ఘంబులన్
దుదకున్ వల్కలమా వ్రతంబ కరుణాదూరంబ ధర్మంబటే. ౭౯

కన్నెన్ నీకిడువేళ నాజనకుచేఁ గళ్యాణపీఠమ్మునన్
బన్నీటన్ గడిగించుకొన్నయవి యా బంగారు పాదమ్ము లీ
కన్నీటన్ గడుగంగఁ జాల మనసౌఁ గన్విప్పి తెమ్మిట్లు న
న్గన్నయ్యా! యెపుడున్న వేగదర ధ్యానమ్ముల్ తపోనిష్ఠలున్. ౮౦

నీ వీరాసనబంధనిశ్చలత ధ్యానింపంగ ధ్యానింప ము
న్నా వెల్వడ్డవి దుఃఖబాష్పములు గా వానందబాష్పమ్ములన్
భావావిష్టత గల్గెఁగాని యది నీ బ్రహ్మైక్య సంధానమా?
శ్రీవైకుంఠ విహారమా! తెఁపుమా! క్షీరాబ్ధి సంచారమా? ౮౧

లోకమ్ముల్ మముఁ జూచి నవ్వుకొనుచున్ లోలోనఁ బుష్పంబెదో
యాకంఠం బడ వెల్లడింతువటరా యానందహాసమ్ము సం
తేకాదే యమృతాశ్రువుల్ గురుతువే ఈపుష్పలోకమ్ముకన్
నీ కేదో పరిభాష యున్నయటులన్ మీచందమే తెల్పెలే.

పువ్వులుగూడ మోహపడిపోవుచు నీమెయి వ్రాలి బంగరుం
బువ్వుల పూజ గూర్చినవి పూర్ణసుధాకరుఁ డిచ్చినాఁడు నీ
కివ్వరమూర్తిమంతునకు నెప్పుడొ కప్పురపున్నివాళి నీ
నవ్వక నవ్వు దృగ్విలసనం బిఁకనైన ననుగ్రహింతువే.

ఎవరో పాపము దేవకాంత యదిగో! హేలాగతిన్ వచ్చి యా
సవడెన్ నీనవకోటిమన్మథవిలాసస్ఫూర్తి మన్మూర్తికిన్
వివశంబైనది లక్ష్మణా! యొక కృపావీచిన్ బ్రసాదించి తే
ర్చవె ధ్యానస్థితిఁ దెల్లవాఱిచి తదాశాజ్యోతి చల్లార్తువే.

౯ పువుఁబుట్టంబుకుఁదోడు కెంజివుఁసొమ్ముల్ తీవయొడ్డాణమున్
శవణింపన్ మెయిఁ బాఱుటాకునఁ బయంటన్ దీర్చి నీచెంగటన్
సవిలాసంబుగ నిల్చియున్నయది సాక్షాదింద్రచాపంబటుల్
రవ కన్నెత్తినఁ జాలు నింక సశరీర స్వర్గసౌఖ్యం బగున్.

తెరచితి గాని కన్ను లటు తీక్ష్ణములైన విలోకనమ్ములం
బఱపెద నేటి కోయి శిశుమానసమూర్తులు గారటోయి యా
సుర లింక నందు సుందరులు శుభ్రహిమమ్ములవంటివారు నీ
వెఱుఁగనివాఁడవా ? యెవర వీ వనుచున్ నిరసింపఁ జూతువా. ౬౬

కను తెఱచు నలుకుఁ దెఱచిన
కను తెఱచినయట్లు యుండఁగాఁ గాచుకొనెన్
కనికరము లేదె పాపము
వినుచు నెదో యూలకింపవే సుమహాత్మా. ౬౭

సిరి తోఁబుట్టువుగా జనించిన ఘృతాచీ నామకక్షీరసా
గర రాజేంద్రకుమారి నచ్చరను స్వర్గంగా ప్రవాహాంబుశీ
కర ముక్తాఫలమ న్యయత్నకృత రంగద్రంగవల్లీ నిరం
తర సౌభాగ్యమయేంద్రనీలమణి సౌధశ్రేణికావేదికన్. ౬౮

పవలున్ రే యనుభేద మేర్పడక శుభ్రజ్యోత్స్నతో సర్వకా
ల వసంతోత్సవ నిత్యయౌవన మహోల్లాసంపు సంపద్ఘనం
బవు స్వర్గంబును వీడగావలసె నింద్రాజ్ఞన్ దలన్ దాల్చి నీ
వెవరం చింత తృణీకరించెద వటోయీ ! దేవకాంతన్ ననున్. ౬౯

ఆప్రాణప్రతిమా ప్రియావిరహబాధాంతంబు గ్రావించి స్వ
ర్గప్రేమామృతధారలోన నినుఁ బర్వస్నాతునిం జేసి ని
త్యప్రీతుం బొనరించుచుండు మనె నీ వా దేవతారక్షణా
ర్థ ప్రాదుర్భవ మాదిశేష నవతారంబంట వింటిం జుమీ.

నట్టువవేళయందునను నాయెడలన్ ధరియించుకొన్న పూఁ
బుట్టముతోఁ, గిసాలయవిభూషలతో నిటు వచ్చి నన్నిధిన్
మెట్టినదానికిన్ దగిన మే లొనఁగూడెను పోయివత్తు నీ
యిట్టికృతున్ మహేంద్రునికి నెంతటి చిన్నతనమ్మొ చూచితే.

ఇది గంగాజలకేళిఁ దేలి దివిలో వే కల్పకచ్ఛాయనో
మదనారాధనఁ జేయు వేళ నుమి మామా యిష్టసంసిద్ధి క
య్యదనున్ నైత మతిక్రమించెడిని జా గౌనేని యంతంతటన్
మది వాహ్యాళికి నైన నందుకొనఁబోదున్ దోడిస్వఃకాంతలన్.

లీలాతాండవ మాపయిన్ జరుగు హాళిన్ దివ్యలావణ్య వ
స్త్రాలంకారధగద్ధగప్రభలె దేహాచ్ఛాదనల్ గాగఁ ద
ద్వేళాభంగిమ భంగికాప్రకటనన్ దేవర్షి బ్రహ్మర్షులే
సోలం జొచ్చెద రీ ఘృతాచి ప్రథమస్తోత్రార్హత త్క్రీడలన్.

నరలోకమ్మునకున్ సుదుర్లభము స్వర్ణస్వప్నరూపమ్ము మా
సురలోకమ్ము సుఖమ్ము నిన్ వెదకుకొంచున్ వచ్చియున్ వెన్కకున్
మఱలింపంబడుచుండె నేమి నరజన్మం బెట్టి భోగిత్వ మే
తెఱఁ గైపోయిన దెంతగా వగచునో దేవేంద్రుఁడీ ధిక్కృతిన్. ౧౪

నీవు గృహస్థుఁ డౌ టెఱుఁగనేరఁడొ భంగముకాదొ దేవతా
స్త్రీవిషయమ్మునన్ బరసతీవిముఖవ్రత మింద్రుఁడంపె నా
జ్ఞావిధి వచ్చియున్నయది సన్నిధి కిష్టమెలర్పకుండినన్
బోవును పాప మాగ్రహము పూనకు మేమనుచుంటి లక్ష్మణా! ౧౫

ఈవు ఘృతాచి వైన మఱి యెవ్వతెవేని పిశాచి వైన నా
క్రేవల నొక్కటే యనృతకిల్బిషమున్ సహియింపనోప విన్
దేవవిభుండు పంచు టెటు దివ్యలతో దివి నున్నవాఁడె? యా
రావణుచేత లంకను చెఱం బడియుండఁడటే మృషాకృతీ. ౧౬

దివిదాకన్ బనిలేదు పో భువిని ప్రాదేశమ్ము మాత్రమ్ము నీ
వవలం బోయెదె నే ననుజ్ఞ యిడ కాహా! యింగితజ్ఞాన శూ
న్యవు నీ వౌటయెగాక యెంత యవమానప్రాప్తునిం జేయుచుం
టివి యయ్యింద్రునిగూడ నేర ననుకొంటే నిన్ను నీపాఠమున్. ౧౭

నిర్యత్నంబుగ వింటి పైకరుగుచుండెన్ జేయి యాశ్చర్య మా
శ్చర్యం బంత సమాధి భంగ మయి యజ్ఞధ్వంసినీతాటకా
చర్యాలాపన బుద్ధి కేర్పడియె నిస్సందేహ మీ వేదొ దు
ష్కార్యాలోచనయా నిశాచరివి స్వర్గస్త్రీవె దుర్భాషిణీ.

ఖరజిహ్వాసహితంబుగాగ వికృతాకారం బెదో కంటి ముం
దరగా నాడునె నిర్నిమిత్తముగ సంధానమ్ము గావింతునేన్
శరమున్ జాపముపట్టె యొక్కనిముషానన్ గామరూపమ్ముతో
నొఱగున్ నీనిజరూప మప్పటిసుబాహున్ దాటకన్ బోలుచున్.

జీవధనమ్ము దక్కినది స్త్రీవగుటన్ వధియింపఁ జుమ్ము నీ
త్రోవను బొమ్ము నీదు కలరూ పెఱిఁగించుక రాకుమీ కుటీ
రావరణమ్ముచాయఁ గల నైనను గాని సహింప వింక నా
యీవిలు నమ్ము లేను సహియించిన నిన్ నరమాంసభక్షిణీ.

నిక్కపు దేవకాంతవలెనే కనుపట్టెనె కామరూప మా
రక్కసియా యిదే ఋషిపరంపర నిత్య మెఱుంగఁ జెప్పు నా
మ్రుక్కడియయ్యెనేనిఁ గడు మోసము తండ్రి ! యిదేమి రూపమా
ముక్కొకదూలమే యదియ మూలమొకో నరవాసనం గొనన్.

ఆశ్రమభూములందు ఋషులాడెడు మాటయు మాటగూడ దూ
రశ్రవణమ్ముఁ జేసి యిది రాక్షసజాతి కెఱుంగఁ దెల్ప నా
విశ్రవసుండు దీని కిడె విద్యను దాని నొరుం డెఱుంగఁ డ
న్యాశ్రయ మింక నీయసురులందున లేనటులన్ విధించుటన్. 102

పాపిష్ఠురాల కానా
యాపన్నంబలెనె యేదొ యాడఁగనుంటే
యీపగిది నెందఱెందఱి
నాపొట్టం బెట్టుకొంటి వన్యాయముగన్. 103

ఏ దుష్టప్రవిక్రియకొ యే నిటు వచ్చినదాన గాను మీ
పాదములాన! మీరలు స్వభావముగాగనె దేవతాప్రియుల్
గాఁదఱుచున్ వినంబడును గాన సురాంగనవేష మూనితిన్
గా దన నాకుమాత్ర మిది కావలెనే కరుణింపఁగావలెన్. 104

ఆ బృందారకకోటి సర్వమును మా యంతఃపురీదాసదా
సీబృందం బిఁక నందులోపలి ఘృతాచీ దేవదాస్యాకృతిన్
నేఁ బూనన్ మది నెంతొ సిగ్గిలితి కానీ నీవు గుర్తించి నా
కీబాధన్ దొలఁగించి వైచితివి నీవే యీ మనోదేహముల్. 105

1 నీ చెలిమిఁ గడింప హావణించుక వచ్చిన నాఘృతాచిపా
త్రోచితమైన భాష నుపయోగ మొనర్చెడిపట్ల సర్వమి
థ్యాచరణం బొనర్చితి దయామయు లీర లెఱుంగ లేరె పై
పై చెఱలాడు ప్రేమ కిఁకఁ బాపము పుణ్యమటన్న శంకయే.

తోడఁ వచ్చి ఫలంబు లేనె కొనితెత్తుఁ లేర చేదోడు వా
దోడై యూర్మిళ యూడిపడ్డ దనిపింతుఁ జూడరా నన్ గృపం
జూడఁగావలెగాని యెంత యయినఁ జూపించి సంసారపుం
జాడన్ మాటికి నొక్క క్రొత్తరుచి నాస్వాదింపఁగాఁజేతురా.

నరమాంసాశన మింతతో విడుతురా నాదైవ మం చెంతురా
చరణం బంటి వచింతురా యొడలి పంచప్రాణముల్ నీవెరా
పరిచర్యాపర మీ మురా వలపు నిల్పఁ శక్యమే గాదురా
కరుణం బోలవురా యొకించుకయినం గానీ తపోధ్యానముల్.

మాయన్న యిడిన నా మాణిక్య గృహమున
నో మోహనా ! మన ముందమింక
దాచుకొందునుర శుద్ధాంతంబునన్ నిను
సౌందర్య మధుకలశంబ రమ్మ

విహారణమ్మునకైన వెడలనీయను జుమా
నొంటిగా నే వెనువెంటలేక
చొక్కుఁడు లేర యీ శూర్పణఖాభోగ
లీలామయుండవై లిప్తలిప్త

నోచి పుట్టితి వట్టె యెందులకుఁ బేద
సీత మఱదివి త్రిభువనజేత యైన
రావణబ్రహ్మ బావమఱంది వగుదు
వెంతలో నెంత గొప్ప యదృష్టరేఖ

ఓయీ! యెట్టినిశాచరీహతకయో యోజించితే దీని యీ
మాయావాగురలన్ దగుల్కొని తపోమాహాత్మ్యముల్ వాసియ
న్యాయంబై రిట నెందఱెందఱొ ఋషుల్ స్వాతంత్రి! యేమేనియున్
ప్రాయశ్చిత్త మొనర్తువే యదెయెదో వాక్రువ్వబో నుంటివే. ॥౧౦

సత్యము నొప్పుకొంటి నినుఁ జంపఁగఁ జేయిఁక రాదుగాని దాం
పత్యముగూడనా మనకుఁ బాతకి! చూచితె యీనరాసుర
వ్యత్యయ మట్టు లుండ విననైనను నే విననేర నిట్టి దు
ష్కృత్యపుమాట పావనగృహిన్ బ్రకృతంబుననో వ్రతస్థుడన్. ॥౧౧

రోదింపన్ ఫలమేమి నీశ్రవణ నిర్మూలంబె యౌఁగావున్
నీ దూరశ్రవణమ్ముతోడ నిఁక నంతే నీపసింబట్టుచే
గాదా ఘ్రాణముగూడఁ జూడు పరమాకాశమ్మునన్ నీదు వ్యా
హారం బంతయు నీకె యెంతటి భయోత్పాతంబుగా నుండునో.

స మా ప్త ము